శ్రీ గురుభ్యో నమః

# శ్రీ గురుబోధామృతము

అను

# వేదసారగ్రంథమును

# భక్తిపాటలును

డాక్టరు, కట్టమంచి కృష్ణారెడ్డి గారి సతీమణి

తిరుమలమ్మ ప్రణీతము




చెన్నపురి:

ఆంధ్రపత్రికా ముద్రాలయమున

ముద్రితము

1922

 [దీనివెల ౪ అణాలు

# విషయసూచిక

# పరిచయ వాక్యములు

---

శ్రీమతి కట్టమంచి తిరుమలమ్మగారు రచియించిన పద్యములను పాటలను నప్పుడప్పుడు నా మిత్రులు కృష్ణారెడ్డిగారి ద్వారా చదివి యానందింపగల భాగ్యము నాకు కలిగినది. శ్రీ గురుబోధామృత మను నీ చిన్నిపొత్తమును తిరుమలమ్మగారు రచియించిరి. వేదాంతసార మను నామాంతరము గల ఈ గ్రంథమునందు భక్తికిని వేదాంతమునకును గల సన్నిహిత సంబంధము తేటమాటలందు దెలుపబడినవి. తిరుమలమ్మగారికి గల స్థిరమైన హరిభక్తి నీ గ్రంథము విశదము చేయుచున్నది. పద్యములు వేదాంతరహస్యములను సాధనవిధులను నీతిబోధలను కలిగి వేమన కుమారీ సుమతిశతక పద్యములను సంస్మరింప జేయుచున్నవి. గ్రంథము సరళశైలిని పవిత్రమైన భావములను కలిగి జనాదరణమునకు పాత్రముగ నున్నది. గ్రంథము స్త్రీల స్వశక్తిస్వాతంత్ర్యప్రయోజనమును సమర్థించుచు నాంధ్రస్త్రీల శక్తిహృదయమును వ్యక్తము చేయుచున్నది.

శ్రీమతి తిరుమలమ్మగారి ప్రయత్నములను సార్థకము చేసిన కృష్ణారెడ్డిగారి భావములును శ్రీకృష్ణాంకితముగ నొనర్చిన తిరుమలమ్మగారిభావములును పరస్పరవిశ్వాసానురాగ భరితములై ప్రశంసార్హములుగ నున్నవి.

కా. నాగేశ్వరరావు

# పీఠిక

ఈ గ్రంథము వేదాంత విషయ సంగ్రహము. త్రిలోకంబులం బరిపాలించెడు మూలపురుషుండు శ్రీ మహావిష్ణువు. అట్టి మహావిష్ణువును సందర్శింప భక్తియె పరమ మార్గంబు. భక్తి కుదురుటకు మార్గంబు సత్యవర్తనము, నిరంతర ధ్యానము. సత్యవర్తనకును, నిరంతర ధ్యానమునకును మార్గం బోర్పు. త్రికరణములయందు నోర్పు గలుగుటకు జన్మాంతర సుకృత పరిపాకము కావలయును. ఈ గుణము లన్నియు నమరిన మహాత్ములకు సాక్షాన్మహావిష్ణువే సద్గురుఁడై నిలిచి సుజ్ఞానమును బోధించి, యజ్ఞానమును దొలఁగించి, వారిని దన దాసులంగాఁ జేసికొనును. అప్పుడు వారు మోక్షంబున కర్హు లగుదురు. ఇదియే మూలపురుషుని సందర్శించుటకు మార్గం బని యెఱుంగునది.

* * * *

ఈ చిన్నగ్రంథము నచ్చటచ్చట సవరించి ముద్రాపణకార్యమునను దమ కార్యభరమునం దోడ్పడినందులకుఁ గాను మ-రా-రా-శ్రీ, మానవల్లి రామకృష్ణకవి ఎం. ఏ., గారికి హృదయపూర్వకముగా మేము వందనము లర్పించుచున్నారము.

క. తిరుమలమ్మ.

శ్రీ గురుభ్యో నమః

# శ్రీ గురుబోధామృతము



శ్రీ నందసుతుని పదముల
నానందముతోడ నెపుడు నర్చింతుఁ గరం
బానలినాక్షుని దయతో
నేనును వేదంబుఁ జెప్ప నేర్చితిఁ బ్రీతిన్.

క. చెప్పఁగఁ బూనితి వేదము
దప్పక శ్రీకృష్ణ నీను దండం బిదుచున్
దప్పులు మన్నించియు మఱి
యొప్పుల వెలయంగఁ జేయు ముర్వి నెపుడున్.

ఉ. చిన్నతనంబునందు ననుఁ
జేరఁగఁ బిల్చి, ముదంబుతోడుతన్
గన్నియ చూడవమ్మ కల
కిందరునిఁ గృష్ణుని చిన్నిరూపమున్
వెన్నునిఁ బూజ చేయు మని
వేమఱు నాకును బోధ చేయుచున్
వెన్నయు ముచ్చిలించి యల
వ్రేతలఁ గూడిన బాలకృష్ణునిన్.

క. ఎన్నఁడు మఱవకు మనుచును
జెన్నలరఁగ బోధఁ జేయు శ్రీ గురుమూర్తిన్
మున్నుగఁ బూజించెద మది
నన్నును గృపఁజూడు మనుచు నా మునిసామిన్.



క. అల్లుం డని మది నెంచక
చెల్లని వ్యాజ్యంబు లెపుడుఁ జేయుచు, మావా
రెల్లరుఁ జిక్కులు వెట్టఁగ
నుల్లంబున ధైర్య మొప్ప నోర్చిన పతికిన్.

క. "మీ వారు చిక్కు బెట్టిరి
యీ విట నుండంగ వలన దేగు మనక" తా
భావమున విసుగు నొందక,
యేవేళం బ్రీతి నన్ను నేలిన పతికిన్.

క. నాతప్పులు సవరించుచుఁ
జేతోమోదంబు చెలఁగఁ జెప్పుచు నాకున్
బ్రీతినిఁ దన ప్రోత్సాహము
చేతను నుత్సాహ మెసఁగఁ జేసిన పతికిన్.

ఉ. చిక్కు లవెన్ని వచ్చినను శ్రీహరి దిక్కని
నమ్మి యాత్మఁ దా । నెక్కువ ప్రీతిచేత నను
నెప్పుడుఁ జూచుచు నేవిధంబునన్ । మక్కువ
దక్కనీక మది మాధవు సేవయ చేయు
మంచు నా । కెక్కువ బోధఁ జేయు పతి కెప్పుడు
మ్రొక్కెద నాత్మ భక్తితోన్ .

# విజ్ఞప్తి

క. యతియుం బ్రాసము గణము ని
యతియును నేనెఱుఁగ విద్యలన్నియు నెఱుఁగన్
గతి నీవే యని నమ్మియుఁ
బ్రతిదినమును హరికి మ్రొక్కఁ బలికెను హరియున్.

క. వేదజ్ఞానము నీకును
నాదయతో నిఁకను గల్గు నాతిరో నీవున్
భేదము లేకయ మదిలో
వేదంబును వ్రాయుమనుచు వెన్నుఁడు చెప్పెన్.

క. అతివా వేదము లెఱుఁగుము
గతియును మోక్షంబు చూపు కావ్యం బొకఁ డే
నతిసూక్ష్మంబుగఁ జెప్పెద
నతులితముగ దాని వ్రాయుమని హరి నుడువన్.

క. చక్కని పద్యంబుల నే
మక్కువతో వ్రాసినాను మాధవునాజ్ఞన్
బెక్కులు చదివిన జ్ఞానులు
చక్కఁగ నివి చూచి దయను క్షమియింపుఁడికన్.

# అంకితము

ఉ. ఎన్ని విధంబులం గొలిచి । యే నిను వేడినఁ, జల్లఁ
జూపకు లేక । బన్నగశాయి, చూడ కిటు । బాధలు
వెట్టుట యేమి కారణం । బెన్నఁడు నిన్నుఁ దప్ప
మఱి । యెవ్వరి నేఁ గొలువన్ మనంబులోఁ । దిన్నఁగ
నన్నుఁ గావు మిఁకఁ । దీర్పుము కష్టము దీనరక్షకా.

చ. సనకసనందనాదిముని । సత్తము లందఱు నిన్నుఁ
గొల్వఁగా । వినయము మీఱ నీసతియు । వేడ్కఁ
జెలంగుచుఁ జెంత నుండ, నా । కనకపు సింహ
పీఠమునఁ । గాంతిఁ జెలంగెడు నీదు రూప మే।
ననయము గొల్తు నామదిని । నర్ఘ్య మొసంగెద
నిష్టసిద్ధికిన్.

క. చలనము లేకయు మదిలో
వెలయఁగ నీకావ్య మిపుడు । వేడ్కఁ జెలఁగఁగా
నిల నర్పించెద నేనును
బలభద్రుని సోదరునకు । భక్తియు మెఱయన్.

క. శ్రీరుక్మిణీశ, నీవర
కారుణ్యముచేత నిపుడు । కావ్యము నే నీ
సారంబు నెఱుఁగ వ్రాసితిఁ
బేరిమి నర్పింతు దానిఁ । బ్రీతిన్ నీకున్.

శ్రీరస్తు

క. అజ్ఞాన ముడిగి నీవును
సుజ్ఞానముచేతఁ గనుము । సూక్ష్మశరీరుం
బ్రజ్ఞావంతుల మనియెదు
నజ్ఞానులబోధ వినకు । మతివరా యెప్పుడున్.

క. కరి మకరి రెండుఁ బెనఁగఁగ
కరి నేటికిఁ బ్రోచె హరియుఁ । గను మది మదిలో
హరియే దిక్కని నమ్మిన
కరిఁ గాచెను మకరిఁ ద్రుంచి । కాంతరొ వినవే.

క. ఏటికి నీమదిఁ జింతలు
పాటింపకు పరులచర్యఁ । బలుమఱు తరుణీ
యాటలె యీనరు చర్యలు
సూటిగ హరి నెఱఁగి నీవు । సుఖముం గనుమా.

ఉ. అన్నలు దమ్ములున్ మఱియు । నాత్మజు లెవ్వరు
రారు వెంట, నా । పన్నగశాయి నెమ్మదిని ।
బాయక యెప్పుడు నీవు గొల్చుచో । నన్ని విధం
బులన్ సుఖము । నా హరి నీకు నొసంగుచుం
డు, నా । వెన్ననిఁ బూజ సేయు మిఁక । వేడ్క
ను నీమది నిష్టసిద్ధికిన్.

క. హరిపద సేవయు మఱవక [illegible]
మొరులను నిందింప కెపుడు [illegible]
హరియే గలఁ డని నమ్ముము
పరచింతలు వీడు మింకఁ । బన్నుగ మదిలోన్.

క. గురుపద సేవయు నెప్పుడు
మఱవక తమయాత్మఁ దలఁచు । మహనీయులకున్
హరిపద సేవయు దొరకును
గురుఁడును హరి యెవరో దీని । గుణవతి గనుమా.

క. హరి యెవ్వఁడు హరుఁ డెవ్వం
డరయుఁగ నజుఁ డెవఁడు వినుమ । యందఱు నొకటే
యెఱిఁగినవారికిఁ దెలియును
హరిచర్యల నెఱుఁగ వశమె । యందఱ కవనిన్.

క. పరు లెవ్వరు నీ వెవ్వరు
పరికింపుము నీకు నీవు పలుమఱు తరుణీ
యెఱిఁగించెద హరిచర్యలు
మఱవకు మదిలోన నెపుడు । మాధవు సేవన్.

క. ఆత్మజ్ఞానము లేక మ
హాత్ముల సేవించి తిరుగ । హరి యెటు దొరకున్
ఆత్మజ్ఞానము కుదిరిన
నాత్మయె హరియె చెలంగు । నరయుము తరుణీ.

క. యోగుల మైత్రిమి మే మని
జోగులవలెఁ దిరుగఁ గాన । చూతురె హరి నీ
యోగము నెఱిఁగినవారలు
మూఁగలవలెఁ జేయుచుంద్రు। మురహరిపూజల్.

క. ఎందఱు యోగులు విఫలతఁ
జెందిరి మది నిష్ఠ నిల్పి । చేయక పూజల్
కుందిరి యోగము చేసియు
నందక శ్రీ హరిపదమ్ము । లామునివరులున్.

క. వన్నెగ గంధముఁ బూసియు,
సన్ననివస్త్రంబు గట్టి । సౌందర్యముగన్
గన్నులను మూసి చేతను
దిన్నఁగ జపమాలఁ ద్రిప్పఁ। దెలియునె కృష్ణున్.

క. కరుణాన్వితుఁ డగుచక్రిని
బరువడి నెఱుగంగ లేకఁ । బలుయోగంబుల్
విరివిగఁ జేయుదు రెందఱొ
యిరవును గన నేర రెపుడు । నింతిరొ వినవే.

ఉ. యాగము లేల చేయుటలు, । నావుల భూముల
దాన మిచ్చుటల్, । బాగుగ మాఘమజ్జనముఁ।
బట్టుగఁ జేయుట చల్లనీటిలో, । నేగుట తీర్థ
యాత్రలకు । నెండల వానలఁ దల్లడిల్లి, తానా

గురుమూర్తిఁ గన్గొనక । యంతయు వ్యర్థము
నీ వెఱుంగుమా.

ఉ. కాశికిఁ బోవ నేల యతి। కష్టముఁ జెందఁగ
నేల, యాత్మలో । నాశలు మోహముల్ విడిచి।
యాహరి దిక్కని నమ్మి యొప్పుచున్ । గేశవనామ
ముల్ మదినిఁ । గీర్తనఁ జేసిన నట్టి వారలున్ ।
గాశికిఁ బోవకుండఁగనె । కాంతురు మోక్షము
నాత్మరీతిగన్.

తే. ముజ్జగంబులఁ బ్రోచెడు । మూలపురుషుఁ
డెవఁడో యెఱుఁగంగ లేక । యేమేమి తపము
నెంత కాలంబు చేసిన । నేమి ఫలము
వత్తి లేకయె వెలుఁగునె । వట్టి ప్రమిద.

ఆ. ఆత్మ నిలిపి గురువు । నరయంగ లేకయు
గురుని కొఱకుఁ దిరిగి । కుంద నేల
నిష్ఠ నిలిపి చూడ । నీలోన గురుఁ డుండు
వెఱ్ఱితనముచేత । వెతలు పడకు.

తే. కావివస్త్రంబు కట్టి తాఁ । గదలిపోయి
యెన్ని యాత్రలు సేవింప । నేమి ఫలము
వెంట నుండెడు గురువుకై । వెదక నేల
మనసు కుదిరినవాఁడె యా । మర్మ మెఱుఁగు.

క. శిలలకుఁ బూజలు చేసియు
నిలఁబడి సాష్టాంగ మిడిన । నిచ్చునె వరముల్
చలనము లేకయె తనమదిఁ
దలఁచినసద్గురుఁడెయొసఁగు। దయతో వరముల్.

క. జపములుఁ దపములుఁ జేసియు
నుపవాసము లుండ నెఱుఁగ। నోపునె హరి, నే
చపలత లేకయు మదిలో
నెపుడును హరిసేవ చేయ। నెఱుఁగుం ద్వరలోన్.

క. వేదము లెఱిఁగితి మనుచును
వాదంబులు చేసినంత । వచ్చునె ఫలముల్
భేదంబు లేక చేసిన
మాధవుపదసేవ, వచ్చు । మానుగ ఫలముల్.

క. జారుగ జందెము వేసియు
తీరుగ నామంబు దీర్చి । తెలుపఁగ నీతుల్
వా రావైష్ణవు లగుదురె
యారఘువరుఁ దలఁపకున్న । నాతతభక్తిన్.

క. నామవిభేదము లేకయు
నేమనుజుఁడు విష్ణుసేవ । నెద నెప్పుడుఁ దా
నేమఱక చేయు చుండునొ
యామనుజునె వైష్ణవునిగ । నరయుము తరుణీ.

క. గృహధర్మమె శ్రేష్ఠం బని
మహనీయులు చెప్ప వినవె। మానిని నీవుఁ
గృహకృత్యంబులు జరుపుచు
నిహపరసౌఖ్యంబు గోరి। యెఱుఁగుము విష్ణున్.
క. సంసారము విడనాడియు
హింసలు పొందంగ నేల। హితమతివై యా
కంసాంతకు మది నిల్పిన
సంసారములోనె నీకు। సద్గతి దొరకున్.
క. సతి సుతులఁ గూడియుండియు
మతిమంతుఁడు మనసునందు। మఱవక హరి నా
యతనిష్ఠను బూజించిన
గతియును మోక్షంబుఁగాంచుఁ। గాంతరొ వినవే.
క. కట్టిన పంజర మెడలుచుఁ
జట్టనఁ దాఁ బోవు చిలుక। చాడ్పునఁ దానున్
బుట్టిన సంసారంబున
గట్టెక్కియు ముక్తిఁ గాంచుఁ। గరివరదుదయన్.
క. హరి హరి యని మదిఁ దలఁచుచుఁ
గరమునఁ గాలాగ్నిఁ బట్టఁ। గాల దడియు శ్రీ
హరినామమహత్త్వం బిది,
యెఱిఁగించెద నీకు దీని। నెఱుఁగుము సుదతీ.

క. మూలము దెలిసిన వెనుకం
గాలాగ్నిని బట్టఁ గలరు । కరమున జ్ఞానుల్
నీలో వెలిఁగెడు జ్యోతియుఁ
గాలాగ్నియు నొకటె కడకుఁ । గను మది తరుణీ.

క. వెలిఁగెడు జ్యోతులు రెంటను [దయన్
గలయు నొకటి యగుచు, నపుడుఁ । గమలాక్షు
వెలిఁగెడు నగ్నికి నీకును
గలుగును స్నేహంబు కాల్పఁ । గడఁగ దది నిర్మన్.

క. కష్టపడి నిష్ఠ నిలిపిన
గష్టంబనఁ గలదె యేది । గాంచుట కైనన్
స్పష్టముగఁ బులులముంగల
నిష్టముతో మెలఁగవచ్చు । నెఱుఁగుము తరుణీ.

క. పులి వచ్చె ననుచు బెదరుచు
వెలవెలఁ బోవంగ నేల । వెన్నుని మదిలోఁ
దలఁచుచు నెదురుగ నిలిచినఁ
బులియును నీచెంత రాక । పోవును బొలఁతీ.

క. మృగములమధ్యను నిలిచియు
ఖగవాహను మదిని నెపుడు । కాంతను వేడన్
మృగ మను నీ వను భేదము
తెగిపోవదె యాతనింబ । తెలియుము తరుణీ.

క. చూపులు వేఱై యుండియు
లోపలఁ గల జీవుఁ డొకఁడె । లోలతఁ గనుమా
రూపము భేదము నెంచక
దాపున నిలిచినను నిన్నుఁ । దాఁకదు పులియున్.

క. ఘటసర్పము నిను గొఱకం
బటుతరముగ రాఁగ బెదరి । పరుగిడ నేలా
యటులనె నిలిచియు వెన్నుని
కుటిలత విడనాడి వేఁడఁ । గొఱకదు ఫణియున్.

క. ఫణి మది దుష్టతనంబును
నణఁగును నీభక్తిచేత । నతివేగమునన్
ఫణితల్ప కుచిత్రంబుల
గణియింపఁగ నెవరితరము । గరితరో వినవే.

క. కుటిలత నీమది విడిచిన
బటుతర మగు విషము పోవు । ఫణికిని నపుడే
కుటిలతయు విషముఁ బోయిన
ఘటభేదము లేక కలసి । కఱవదు ఫణియున్.

క. జల ముప్పొంగుచు వచ్చినఁ
జలనము లే కాత్మ విష్ణు । చరణము నిలుపన్
బలముగ వచ్చిన జలమును
దొలఁగును హరిమహిమచేతఁ । దోయజనేత్రీ.

క. జల ముప్పొంగను బలమును,
నిల నీవును దిరుగ బలము, । నెవ్వరివలనన్
గలిగెనో మది నెఱిఁగియు నా
జలజాక్షునిఁ దలఁప నపుడె । జలమునునిలుచున్.

క. బల మొసఁగెడు గురు నెఱిఁగిన
బలమంతయు నొకటి యగును । బరికింపంగాన్
జలబలమును నీబలమును
వెలయుం దగ నొకటియగుచు । వెలఁదిరో వినవే.

క. చెట్టును ప్రాఁకియు గట్టిగఁ
బట్టిన కరములను విడిచి । పరమాత్మ యనన్
జెట్టున నుండియుఁ బడకయుఁ
బట్టుగ నిలువంగ వచ్చుఁ । బైననె తరుణీ.

క. చల్లఁగ వీచెడు గాలియు
నుల్లంబున మెలఁగుచుండు । నూపిరి యొకటే
యల్లిన వల్లి విధంబున
మెల్లఁగ నిను నిలుపు గాలి । మేఘంబులలోన్.

క. సూలశరీరము విడిచియు
వాలాయముగాను దిరిగి । వత్తురు జ్ఞానుల్
స్థూలము సూక్ష్మము గనుటకు
మూలము హరిభక్తి వినవె । ముదితరో నీవున్.

క. బొందిని విడిచియు జీవుం
డెం దెందో తిరిగి వచ్చు । నెఱుఁగుము తరుణీ
యందఱు గననేర్తురె యది
సందేహాము లేదు నిష్ఠ । సలిపినఁ దెలియున్.

క. కొండల గుహలం దిరిగియు
నిండిన నదులెల్ల దాఁటి । నిముసములో న
య్యండజవాహనుకృప భూ
మండల మంతయును దిరిగి । మరలంగ నగున్.

క. గాలిం బోయెడి సూక్ష్మము
నేలాగున నెఱుఁగఁగలరె । యిలలో నరు ల
మ్మూలము దెలిసిన భక్తులె
యీలాగున తిరుగనేర్తు । రింతిరో వినవే.

క. స్థూలశరీరము బయటను
నేలాగున సూక్ష్మదేహ । మేఁగును కనుమా
మేలైన నిష్ఠ నిలిచిన
గాలిని దా నెగిరి పోవుఁ । గమలాక్షుదయన్.

క. మింటికి మంటికి మధ్యను
నంటియు నంటకయ యెపుడు । నతివేగము తోన్
నొంటరిగఁ దిరుగు చుండును
వింటివె హరిచర్య నీవు । వెలఁదిరో యిపుడున్.

క. కంటికిఁ దెలియని యణువై
యంటియు నంటకయుఁ దిరుగు। నతి వేగముతోఁ
గంటివె యీసూత్రంబును
వింటివె యెపుడైన నిట్టి। వేదము సాధ్వీ.

క. ఆసనము వైచి మదిలో
వేసట లేకుండ నెపుడు। వెన్నుని సేవన్
జేసిన వారికి వేగమె
గాసియుఁ దొలఁగించు హరియుఁ। గరుణను దరుణీ.

క. వెనువీఁపు చక్క నిలిపియుఁ
గొనముక్కున దృష్టి నిలిపి। కూర్చుని తానున్
గను మూసి తనువు మఱచినఁ
దనలోపల నున్న గురుని। దర్శించు సతీ.

క. వేకువజామున మేల్కని
ప్రాకటముగ మనసు నిలిపి। పరమాత్మునిపై
నేక ధ్యానము చేసిన
నీకును హరి యొసఁగు ముక్తి। నీరజనేత్రీ.

క. అతివా నిష్ఠను నిలిపిన
మతిమంతుల హృదయమందు। మాధవుఁ డెపుడు
న్నత కాంతిని వెలుఁగుచుఁ దా
హితమతి బోధించుచుండు। నెఱుఁగుము దీనిన్

క. పాలఁ బడి నీరు తానుం
బాలై గనిపించు చుండుఁ । బరికింపంగా
నాలాగున యోగుల మది
వాలాయము హరినిఁ జేర । వచ్చును ముక్తి౯.

క. జననీజనకుల చెంతను
జనవునఁ దనయుండు మెలఁగు । చాడ్పున భక్తుం
డనయము శ్రీహరి చెంతను
వినయముతో మెలఁగుచుండు । విను మిది తరుణీ.

క. ఈ కావ్యము నీకరుణం
బ్రాకటముగఁ జెన్నపురిని । రచియించితిఁ గృ
ష్ణా కరుణానిధి నీదయ
లేక యె యే వ్రాయఁ గలనె । లేశము నైన౯.

క. మంగళము గోప బాలక
మంగళ మిదె నీకు మాని । మండలవిహారా
మంగళ మంగజజనకా
మంగళ మర్పింతు నీకు । మహానీయనిధీ.

గద్యము. ఇది సర్వలోకరక్షాధురీణ శ్రీకృష్ణ కరుణా కటాక్షవీక్షణా మోదిత పాకనాటికులోద్భవ సదాశివగోత్రపవిత్ర చెన్నపురీనివాస డాక్టరు బి. ఏ., ఎం. బి. బి. యస్. ముఖ్య బిరుదాంకిత కట్టమంచి కృష్ణారెడ్డ్యర్ధాంగలక్ష్మి తిరుమలమ్మ విరచితం బగు శ్రీగురుబోధామృతం బను వేదసారగ్రంథము సంపూర్ణము.

## శంకరాభరణము - ఆదితాళము

౧. నంద బాలకా । నన్ను బ్రోవకా
యెందు బోతివో । యిందు రారశ్రీ॥ నం॥

౨. ఎంత వేడినా । యేలరావురా
శరణు జొచ్చితి । కరుణ జూడరా॥ నం॥

౩. నీదు భక్తుని । నిర్మలాత్మునీ
అసుర బాలునీ । ఆదరించినా॥ నం॥

౪. సభను ద్రౌపదీ । శరణు వేడగా
అభయ మిచ్చియూ । ఆదరించినా॥ నం॥

౫. ఆకు చేలుడూ । అటుకు లివ్వగా
అధిక సంపదా । అంద జేసినా॥ నం॥

౬. కుంతి తనయునీ । కూర్మి తోడుతా
చెంత జేర్చి నీ । చెల్లె నిచ్చినా॥ నం॥

౭. సురుల బ్రోచినా । సుందరాంగుడా
మ్రొక్కి వేడెదా । మోము జూపరా॥ నం॥

౮. గోప ఘోలరా । గోప బాలకా
దాపు నీవనీ । దలచి నానురా॥ నం॥

౯. కరిని బ్రోచినా । కామ జనకుడా
ఇప్పుడు నా మొరా । యేల వినవురా॥ నం॥

౧౦. పసుల గాచినా । పంక జాక్షుడా
విసుగు జెందకా । వినుము సామిరా॥ నం॥
౧౧. తిరుమ లాంబకూ । దిక్కు నీవెరా
చింత దీర్చి నీ । చెంత జేర్చరా॥ నం॥

తోడి - ఆదితాళము.

౧. వేణు గానము । వెలది చూడుము
పంక జాక్షుడు । పాడు చుండెడు॥ వే॥
౨. జలక మాడెడు । జలజ నేత్రుల
చీర లెత్తిన । చిన్ని కృష్ణుని॥ వే॥
౩. పొన్న చెట్టున । పొంక మొప్పగ
నిలిచి పాడెను । నీరజాక్షుని॥ వే॥
౪. గొల్ల భామల । గోర్కె తీర్చను
జన్మ మెత్తిన । జలజ నేత్రుని॥ వే॥
౫. పశుల గాచుచు । పాడు చుండెడు
సుందరాంగుని । నంద బాలుని॥ వే॥
౬. మేత మేయక । మెడలు యెత్తుచు
ఆవు లన్నియు । ఆల కించెను॥ వే॥
౭. పాపి పూతకి । పాలు నంతయు
పీల్చి చంపిన । చిన్న కృష్ణుని॥ వే॥

౮. తనయు డంచును । తల్లి యొంచియు
రోల గట్టిన । లోకరక్షకు॥ వే॥

౯. మద్ది మాకుల । మధ్య దూరియు
నేల గూల్చిన । నిర్మ లాంగుని॥ వే॥

౧౦. కరుణ మాలిన । కంసు బట్టియు
కాల దన్నిన । కమల నేత్రుని॥ వే॥

౧౧. ఆకు చేలుడు । అటుకు లివ్వగ
సంప దిచ్చిన । శ్యామ లాంగుని॥ వే॥

౧౨. విషము గ్రక్కుచు । వీగు కాళుని
పడగ లెక్కిన । పద్మనాభుని॥ వే॥

౧౩. కృష్ణ జన్మము । కోరు చుండిన
మునులు సురులకు । మోక్ష మిచ్చిన॥ వే॥

౧౪. ఎవరి కబ్బును । యిట్టి గానము
మోక్ష మిచ్చెడు । మోహ నాంగుని॥ వే॥

౧౫. అతివ తిరుమల । ఆశ దీరగ
నీవు చూడుము । నీల వర్ణుని॥ వే॥

౧౬. ఎన్ని జన్మము । లెత్తి నాయిక
వినగ శక్యమె । వేణు గానము॥ వే॥

## హిందూస్థానిరాగము - ఆదితాళము

౧. రాధలోల నీకు నిదిగో । రమ్య హారతీ
చేకొనూము శేషశయన । చెలగి రాధతో ॥ రా॥

౨. ఆత్మ భక్తి తోడ నీకు । నర్ఘ్య మిచ్చెదా
ఆర గింపు మయ్య నీవు । ఆది పూరుషా॥ రా॥

3. నిత్య పూజ చేతు నీకు । నిర్మ లాత్మతో
నిష్ఠ నిల్పు మార్గ మేదో । నీవు దెల్పుమా॥ రా॥

౪. బాల్య మపటి నుండి నిన్ను । భజన చేసితీ
తల్లి తండ్రి నీవె యనుచు । దలచి వేడితీ॥ రా॥

౫. బంధు వర్గ మనెడి వారి । పంచ జేరనూ
కష్ట మంచు బోయి వారి । కరుణ వేడనూ॥ రా॥

౬. పొట్ట కూటి కొఱకు చిక్కు । పెట్ట కెప్పుడూ
ఇష్ట సంప దిచ్చి మమ్ము । యీవు గావుమా॥ రా॥

౭. పిన్న తండ్రి పెద్ద తండ్రి । ప్రీతి పుత్రులూ
మాదు సొత్తు కాశ జెంది । వాదు చేయగా॥ రా॥

౮. అన్న గారు కన్న వారు । అంత చేరియూ
కలహామునకు కాలు ద్రవ్వి । కష్ట పెట్టగా॥ రా॥

౯. ఏమి దోచ కపుడు నిన్ను । యేను వేడగా
కష్ట మెల్ల దీర్చి మమ్ము । కరుణ బ్రోచినా॥ రా॥

౧౦. నన్ను కోరి పెండ్లి యాడి । నాదు భర్తయూ
అనుభవించె కష్టములను । అత్త గారిచే॥ రా॥

౧౧. కష్ట మనుచు తాను మదిని । నిష్ఠ వీడదూ
ఇష్టదైవ మనుచునిన్ను । యెదను నమ్మియూ॥ రా॥

౧౨. వెలిచి కష్ట ములకు దాను । వెనుక దీయకా
జయమునొందె నీదుకృపను । జగతిఖ్యాతిగా॥ రా॥

౧౩. చేరి శత్రువులును చేయు । చెడ్డ తలపులూ
ముందుగానె తెలిపిమాకు । ముక్తిమాపెడూ॥ రా॥

౧౪. పాల నంబు చేయుచెన్న । పట్న మందునా
తిరుమలాంబ మొరలు వినుచు । దీర్చుకష్టమూ॥ రా॥

బిలహారి - ఆదితాళము

౧. అంబరో నీకును । హారతి నిచ్చెద
గైకొను నీవును । కరుణను నిప్పుడు॥ అం॥

౨. సుందరి నీకును । సొగసుగ హారతి
అందరు చేరియు । అందము తోడుత॥ అం॥

౩. బాలుర గూడియు । భజనలు చేయుచు
వేడుట నిన్నును । నేడ్కను చూడుము॥ అం॥

౪. నాదగు భర్తయు । నీదగు పాదము
పట్టుచు భక్తిని । పాలన జేయవె॥ అం॥

౫. పుట్టిన యింటను । బెట్టిన కష్టము
మఱవను నేనిక । మనసున నెప్పుడు॥ అం॥

౬. పాపిని నన్నును । పట్టఁగ గోరిన
భర్తకు వచ్చెను । బహువిధ కష్టము॥ అం॥

౭. పాపులు పెట్టెడు । బహువిధ కష్టము
దీర్చియు మమ్ముల । జేర్చును చెంతకు॥ అం॥

౮. కష్టము బాపను । కానము యెవ్వరు
నమ్మితి నిన్నును । నను దయ బ్రోవవె॥ అం॥

౯. బంధువు నీవని । బలమును నీవని
దలచితి నేమది । ధైర్యము తోడుత॥ అం॥

౧౦. తిరుమల కష్టము । దీర్చియు నింకను
పట్నము నందున । పాలన జేయవె॥ అం॥

## కల్యాణి - ఆదితాళము.

౧. నారద గానము । నరుల వినోదము
పాడుట చూడుము । పంకజ నేత్రీ॥ నా।

౨. అందఱు వినుటకు । నర్హ్వాలు గారే
సుందర గానము । చూడుము నీవ్వా॥ నా।

3. మెప్పుగ సురలును । మెచ్చిన గానము
యిమ్మహి నెవ్వరు । యెఱుగని గానము॥ నా

౪. ఇంపుగ బాడును । యాశుడు మెచ్చగ
సొంపుగ నుండును । సుందర గానము॥ నా।

౫. పంచమ స్వరము । బాడుట చూడుము
పంకజ నేత్రుని । పాటలు పాడును॥ నా

౬. కరగును రాళ్లును । కఠిన మనస్సులు
కమల దళాక్షుని । కథలను బాడును॥ నా

౭. గానము సొంపును । వీనుల కింపును
మోహాన రూపుడౌ । మురహారి గానము॥ న

౮. తాళము శ్రుతితో । తంబుర మీటుచు
పాడెదు పాటలు । పాపులు యెఱుగరు॥ న

౯. ఇంతయు జెప్పుట । యెందుకు నీకన
ఇంగిత మెఱుగుము । యింతిరో నీవును॥ నా॥

౧౦. వేదము లెఱుగని । వెలదిరో తిరుమల॥
వేదము లిప్పుడు । వేడ్కను వినుమా॥ నా॥

శంకరాభరణము - రూపకము

౧. దయయుంచి మదిలోను । ధరణిపై జనులార
గోవధను మానుడీ । గొబ్బునా యిక మీరు॥ద॥

౨. క్షీరసాగరమందు । శ్రీలక్ష్మితో బుట్టి
నట్టిగోవును మీరు । పట్టి చంపకుడయ్య॥ ద॥

3. పాలించిమిముబ్రోచు । ఫాలనేత్రుడు యెక్కు
నందీని మదినెంచి । నరులార యికమీద॥ద॥

౪. గోపబాలుడు మున్ను । మేపినగోవ్రాల
నేవేళలయందూ । నెక్కువప్రీతితో॥ ద॥

౫. వెన్నూదు పాడెదూ । వేణుగానము వినుచు
నానందమును బొంది । నట్టిగోవులపైన॥ ద॥

౬. పరమాత్మునకుమీరు। పంచామృతము చేయ
పాలు నొసగుచునుండు । పసిగోవులమీదా॥ ద॥

౭. లక్ష్మీస్వరూపంబనీ । లలనాలు పూజించు
పాలగోవును మీరు । పట్టికొట్టకుడయ్యా॥ ద॥

౮. తల్లి లేనియట్టి । పిల్లాల పోషించు
కన్నతల్లులవంటి । కామధేనువులపై॥ ద॥

౯. పాలు పెరుగును వెన్న । పరగనిచ్చుచు నెపుడు
పుష్టితగ్గకమిమ్ము । పోషించుగోవుపై॥ ద॥

౧౦. తిండిధ్యానము మీకు । పండించియివ్వనూ
యెండలోగష్టించు । యెద్దులపై మీరు॥ ద॥

౧౧. పాలు నమ్ముకొనుచు । పసిదూడలనెల్లా
మూతూలు బిగగట్టి । ముందుద్రోయకుడయ్యా॥ద॥

౧౨. తల్లి పాలుకొరకూ । తల్లడిల్లుచుదూడ
లెండి చచ్చునట్లూ । యేలాచేసెదరయ్యా॥ ద॥

౧౩. ధరణిపై గోవూల । దండిగ పెంచీన
దారిద్రయముతొలగి।ధన్యులగుదురు మీరు॥ద॥

శంకరాభరణము - ఆదితాళము

౧. పాపమోచన - భక్త పాలన - పంత మేలర - నా పయిన్
యింత వాడవు - యీవటంచును - యెఱుగనైతిర - ముందుగా॥ పా॥

౨. శేషతల్పక - చెంత జేర్చియు - చింత దీర్చియు - బ్రోవరా
పంకజాక్షుడ - పరుల వేడను - పాపముల్ యెడ-బాపరా॥ పా॥

3. బాల్య మప్పుడె - పట్టి నీపద - పంకజంబుల - భక్తితో
సేవ జేసియు - శరణు జొచ్చితి - శంకలన్నియు - దీర్చరా॥ పా॥

౪. గరుడవాహన - కరుణ జూచియు - గావు నన్నిక - వేగమే
చాలు యీ సం-సారసుఖ మిక - సరగునను పా-లించరా॥ పా॥

౫. తిరుమలాంబకు - దీర్చి కష్టము - దీనరక్షక - ప్రోవరా
మ్రొక్కి వేడెద - మొరలు విని యిక - మోక్ష మివ్వర - వేగమే॥ పా॥

హిందూస్థానికాఫీ - ఏకతాళము

౧. పురాణ పురుషా - బిరాన నాకిటు - వరా లొసంగవదేరా।
సురారి పూజిత - మొత్తాలకించియు - బిరాన నన్నిక - బ్రోవూ॥ పు॥

౨. శేషశయన నిను - వాసిగ నమ్మితి - దోషము నాకడ - యేమీ।
గజేంద్ర మోక్షక - భజింతు నిన్నును - నిజంబుగా నను - బ్రోవూ॥ పు॥

౩. పాపము ద్రుంచియు - పాలించెదవని - పట్టితి నీపద - యుగమూ।
ప్రహ్లాదు బ్రోచిన - పగిదిని నన్నును - పాలనజేయువ - దేరా॥ పు॥

౪. వరహావతార - వైకుంఠవాస - వర్ణించెద ని - న్నెపుడూ।
దుర్జనసంహార - నిర్జరరక్షక - వర్జింపకు నను - మదినీ॥ పు॥

౫. శబరిని బ్రోచిన - శౌరివి నీవని - శరణము వేడితి - గదరా।
రాతిగ నుండిన - నాతిని బ్రోచిన - రీతిగ నన్నిక - బ్రోవూ॥ పు॥

౬. శైక వరంబున - కానకు నేగిన - కౌసల్య సుత నిను - గొలుతూ।
వాలిని జంపియు - వారిధిదాటిన - వాడవు నను బ్రోవలేవా॥ పు॥

౭. రావణు జంపియు - రమణిని దెచ్చిన - రాఘవ నీవిటు - రారా।
విభీషణాదుల - కభయం బొసగిన - యిభ రాజ వరద బ్రోవ్రా॥ పు॥

౮. పరాకు చేయక - మొఱాలకింపుము - మురారి నీకిది - మేరా।
ఆపద దీర్చియు - ద్రౌపది బ్రోచిన - శ్రీపతి నన్నిట - బ్రోవ్రా॥ పు॥

౯. ముచ్చిలి వెన్నయు - తెచ్చుక తినియెడు - అచ్యుత నమ్మితి నిన్నూ।
అన్యుల వేడను - అర్జున సఖుడా - ఆదరించి నను - బ్రోవ్రా॥ పు॥

౧౦. గోవుల మేపిన - గోపబాలకా - కోపము నీకేల - రారా।
పట్టుగ కాళియు - పడగల నెక్కిన - పంకజాక్ష పా - లించూ॥ పు॥

౧౧. కంసుని ద్రుంచిన - కమలాక్షుడ నను - కరుణను జూడవ - దేరా
శిశుపాలు జంపిన - శ్రీహరి నామది - చింతలు దీర్పను - రారా॥ పు॥

౧౨. మద్దుల గూల్చిన - ముద్దులకృష్ణా - పద్దేలర నా-మీాదా।
చేడెల చీరలు - చెట్టున బెట్టిన - శ్రీపతి నన్నిక - బ్రోవూ॥ పు॥

౧౩. ఆరాధల్లోల - నేగీతి వేడ - నీరూపు జూపవదేరా।
నేరీతినైన - నీరూపు జూపి - మురారి యిక నను - బ్రోవూ॥ పు॥

౧౪. దీర్చియు కష్టము - చేర్చుము చెంతకు-నర్చించెద నిను - మనినీ।
ఏపాప మెఱుగ - నాపాలిదైవమ - కాపాడి నను దయ - బ్రోవూ॥ పు॥

౧౫. నాపతి కెప్పుడు - నాపద లేకను - శ్రీపతి నీవిక - బ్రోవూ।
ధరాతలంబున - భిరాన తిరుమల - మొఱాలకింపుము - దేవా॥ పు॥

